


# తెలుఁగు సమస్యలు

*చెలువుగ రామలక్ష్మణులు సీతకుఁ దమ్ములు శంభుఁడన్నయున్.

చ. అలర గణింపఁబంక్తిరథునాత్మజు లెవ్వరు ? మైథిలుండు నే
లలనకుఁదండ్రి? మన్మథునిలావుశరంబులునేవి? కాళికా
చెలువునినామమెద్ది? మఱి సీరికి శౌరియు నేమి కావలెన్?
చెలువుగ రామలక్ష్మణులు సీతకుఁదమ్ములు శంభుఁడన్నయున్. 1

*భల్లూకముకడుపులోన భానుఁడు గ్రుంకెన్.

క. అల్లంత ప్రొద్దుకాఁడను
విల్లందుక వేటకాఁడు వేయఁదొడంగెన్
జిల్లంపకోల చిక్కెను, భల్లూ... 2

*రంకులు తేఁ బోయి యేడురాత్రి ళ్లాయెన్.

క. అంకయ వెంకయగూడుక
వంకాయలపాటి త్రోవ వడిగాఁ బోవన్
ఇంకను రాకుండిరి గో, రంకులు... 3

*గుత్తపుతాపితారవికకుట్టు పటుక్కున వీడె నింతికిన్.

ఉ. అత్తఱిఁ జిత్తజుండు విరహాంగనలం గనలింప నిక్షువి
ల్లెత్తిధనుర్గుణంబు మెఱయించి నిశాతవినూతనప్రసూ
నోత్తమబాణపంక్తికుచయుగ్మముదాటునఁదాఁక నేసినన్, గు

ఉ. ఇత్తఱి రమ్మర మ్మనుచు నింపుగ గొల్లలు తన్నుఁ బిల్వఁగాఁ
దత్తరపాటునం గదిసి తాండవకృష్ణుఁడు సుందరాంగిపై, మొ
త్తనిపూలపాన్పువన్ను మెచ్చిచనుంగవలంటినప్పుడే, గుత్త...

*దిద్దిమ్మని వత్సనాయితిమ్మనియింటన్.

క. అద్దిర! శ్రీభూనీళలు
ముద్దియ లాహరికి గలరు ముగురమ్మలలో
పెద్దమ్మ నాట్య మాడెను, దిద్దిమ్మని... 6

*ఉత్తరమున భానుబింబ ముదయం బయ్యెన్..

క. అత్తుగఁ దూరుపుపడమరఁ
జిత్తరువు లిఖించి నిదురఁ జెందితి నౌరా!
చిత్తరువు వ్రాయఁబోవలె, నుత్త... 7

*విపరీతపుఁబులుసుకూర విస్తరి మ్రింగెన్.

క. అపురూపపు లేఁతాకుల
విపరీతపు బ్రాహ్మణుండు విస్తరిఁ గుట్టెన్
చపలాక్షి వండి పెట్టెను, విపరీ.... 8

*సుగ్రీవునియెడమకాలు శునకము గఱచెన్.

క. అగ్రారపునడివీథిలో
నిగ్రహముఁగ బొమ్మలాట నేర్చిన నాడన్
విగ్రహము లెత్త మఱచిన, సుగ్రీ... 9

*నినునిను నిన్ను నిన్ను మఱి నిన్నును నిన్నును నిన్ను నిన్నునన్.

చ. అనిలజ! జాంబవంత! కమలాప్తతనూభవ! వాయుపుత్ర! యో
పవన! సుషేణ! నీల! నల! భానుకులుం డగు రాఘవేంద్రుఁ డ
ద్దనుజపురంబు వే గెలువ దైత్యులఁ జంపను వేగ రమ్మనెన్, ని...

చ. అనఘ సురాపగాతనయ! యర్కతనూజ విచిత్రవీర్యనం,దన
గురుపుత్ర! ద్రోణ! కృప! నాగపురీశ్వర! దుస్ససేన!ర,క్షనుమనె
రాజసూయముయమాత్మజుఁడిప్పుడు చేయఁబూనితా, ని...

చ. అనఘసురేశ! వాయుసఖ! యర్యమనందన! రాక్షసేంద్ర! యా
వననిధినాథ! గంధవహ! వైశ్రవణా! నిటలాక్ష! తాను ర,క్షను
మనిచెప్పెమాధవుఁడుమారుని పెండ్లికిమిమ్మునందఱిన్, ని...

*సొరచెట్టున బీరకాయ సొంపుగఁ గాచెన్.

క. అరవిందకోమలంబగు
నరవిందపుఁగోలనుకెలననావలపిఱుఁదన్
గరిమనుసొంపుగఁ జూచిన, సొర... 13

*విధవాగమనంబు మిగుల వేడుక నేసెన్.

క. అధికారిదర్శనేచ్ఛా
గ్రథితుఁడనై సుశకునంబుఁ గాంక్షింపఁగ నా
కధికఫలప్రద యగుచును, విధవా... 14

*కన్నకుమారుండు మగఁడు గాఁగ వరించెన్.

క. అన్నన్న ! రాధ సొగసున
కెన్నిక యగుమగఁడులేవిక హేలాగతిచే
నన్న యగునందగోపుఁడు, కన్న... 15

*రతిరాజగృహంబుమీఁద రవి యుదయించెన్.

క. అతివలమొగ మెఱుఁగక యీ
గతి నతిరతివాంఛఁ దగిలి కష్టసుఖములన్
మతిఁ దలఁపవు, లే లెమ్మిఁక, రతి.... 16

ఉ. ఇ త్తఱి రమ్మురమ్మనుచు నింపుగ గొల్లలు తన్నుఁ బిల్వఁగాఁ
ద త్తరపాటునం గదిసి తాండవకృష్ణుఁడు సుందరాంగిపై, మె
త్తనిపూలపాన్పునను మెచ్చిచనుంగవలంటినప్పుడే, గు త్త...

*దిద్దిమ్మని వత్సవాయితిమ్మనియింటన్.

క. అద్దిర! శ్రీభూనీళలు
ముద్దియ లాహరికి గలరు ముగురమ్మలలో
పెద్దమ్మ నాట్య మాడెను, దిద్దిమ్మని... 6

*ఉ త్తరమున భానుబింబ ముదయం బయ్యెన్.

క. అత్తుగఁ దూరుపుపడమరఁ
జి త్తరువు లిఖించి నిదురఁ జెందెతి నౌరా!
చి త్తరువుఁ వ్రాయఁబోవ లె, ను త్త... 7

*విపరీతప్రుఁబులుసుకూర వి స్తరి బ్రింగెన్.

క. అపురూపపు లేఁతాకుల
విపరీతపు బ్రాహ్మణుండు వి స్తరిఁ గుట్టెన్
చపలాక్షి వండిపెట్టెను, విపరీ.... 8

*సు గ్రీవునియెడమకాలు శునకము గఱచెన్.

క. అగ్రారపునడివీథిలో
నిగ్రహముగ బొమ్మలాట నేర్పున నాడన్
వి గ్రహము లె త్త మఱచిన, సు గ్రీ... 9

*నినునిను నిన్ను నిన్ను మఱి నిన్నును నిన్నును నిన్ను నిన్ను నున్.

చ. అనిలజ! జాంబవంత! కమలా ప్తతనూభవ! వాయుపుత్ర! యో
పవన! సుషేణ! నీల! నల! భానుకులుం డగురాఘువేస్వ్రిఁ డ
ద్దనుజపురంబు వేగెలువ దైత్యులఁజంపను వేగరమ్మనెన్, ని...

చ. అనఘ సురాపగాతనయ! యర్కతనూజ విచిత్రవీర్యనందన
గురుపుత్ర! ద్రోణ! కృప! నాగపురీశ్వర! దుస్ససేన!రమ్మనుమనె
రాజసూయముయమాత్మజుఁడిప్పుడు చేయఁబూనితా, ని...

చ. అనఘసురేశ! వాయుసఖ! యర్యమనందన! రాక్షసేంద్ర! యో
వననిధినాథ! గంధవహా! వైశ్రవణా! నిటలాక్ష!తాను రమ్మను
మనిచెప్పెమాధవుఁడుమారుని పెండ్లికిమిమ్మునందఱిన్, ని...

*సొరచెట్టున బీరకాయ సొంపుగఁ గాచెన్.

క. అరవిందకోమలంబగు
నరవిందపుఁగోలనుకెలననావలపిఱుఁదన్
గరిమనుసొంపుగఁ జూచిన, సొర... 13

*విధవాగమనంబు మిగుల వేడుక నేసెన్.

క. అధికారిదర్శనేచ్ఛా
గ్రథితుఁడనై సుశకునంబుఁ గాంక్షింపఁగ నా
కధికఫలప్రద యగుచును, విధవా... 14

*కన్నకుమారుండు మగఁడు గాఁగ వరించెన్.

క. అన్నన్న ! రాధ సొగసున
కెన్నిక యగుమగఁడు లేవిభ హేలాగతిచే
నన్న యగునందగోపుఁడు, కన్న... 15

*రతిరాజగృహంబుమీఁద రవి యుదయించెన్.

క. అతివలమొగ మెఱుఁగక యా
గతి నతిరతివాంఛఁ దగిలి కష్టసుఖములన్
మతిఁ దలఁపవు లే లెమ్మిఁక, రతి... 16

*గాడిద యేడిచెఁ గదన్న ! ఘనసంపన్నా !

క. ఆడినమాటకుఁ దప్పిన
గాడిదకొడుకంచుఁ దిట్టఁగా విని యయ్యో !
వీఁడా నాకొకకొడుకని, గాడిద... 17

*ముట్టుడిగినసతికి నొక్క మొగశిశు పుట్టెన్.

క. ఇట్లాకఠినప్రాసము
లెట్లాటికవీంద్రు కయిన నీయందగునా
యట్లయితే నవమాసపు, ముట్టుడిగి... 18

*ఇనశశిబింబయుగ్మ ముదయించె దినాంతమునందుఁ దద్దిశన్.

చ. ఇనసమతేజ! మీరు సెలవిచ్చినపీఠము హేమరత్నసం, జన
నము మేరుప్రస్తరము చక్కఁగఁదీర్చితి వక్షమయ్యె నేర్పున
సురకోటులం దిశలఁ బొల్పుగ వ్రాయుచు రాఁగనేటికిన్...

*కప్పకు సంపంగినూనె కావలె వింటే.

క. ఇప్పార మేలెడిపార్థివుఁ
డిప్పుడు నీతావు కనిచె నిదిగో యార్యా !
తెప్పున నంగడితలుపులు, కప్ప... 20

*ఎలుకలు తమకలుగులోని కేనుఁగుఁ దీసెన్.

క. ఇలలో నిద్దఱురాజులు
మలయుచుఁ జదరంగమాడి మాపటివేళన్
బలమెత్తి కట్ట మఱచిన, నెలుక... 21

*చట్రాతిని నారఁ దీయఁ జయ్యన వచ్చున్.

క. ఇట్రార యుక్తి చెప్పెద
పట్రా యిది తాటిమట్ట పదిలముతోడన్
కొట్రా నీభుజశక్తిని, చట్రా... 22

*పాతరలో సూర్యుఁడుదయపర్వత మెక్కెన్.

క. ఈతటి కాపుల పిలువుఁడు
రాతిరి ప్రొద్దెల్ల జాతరాయెను ధాన్యం
బాతురముగఁ బోయింతము, పాతరలో... 23

*వక్త్రంబుల్ పదికన్నులై దుకరముల్ వర్ణింపఁగా వెయ్యగున్.

శా. ఈక్త్రాప్రాసము చెడ్డదంచు విన మీ రెంతేసివా రాడఁగా
వాక్త్రాసం బది సత్కవీశ్వరుల త్రోవల్ గావు నేఁ జెప్పెదన్
దిక్త్రారాతికిఁ బార్వతీశ్వరులకున్ దిగ్మప్రభారాతికిన్, వక్త్రం.

*గుంద్రాతికిఁ గాళ్లు వచ్చి గునగున నడిచెన్.

క. ఉంద్రా యోరి దురాత్మక!
ఇంద్రాప్రాసంబు కవుల కియ్యందగునా
యంద్రాముపదము సోఁకిన, గుంద్రా... 25

క. ఉంద్రానియడవిలోపల
గుంద్రాయై యున్నయట్టికోమలిపైఁ గో
దంద్రాముపదము సోఁకిన, గుంద్రాతికి... 26

క. తండ్రిపనుప మునివెంటను
పండ్రెండవయేఁట రామభద్రుఁడు చనికా
ల్గుండ్రించి ధూళిఁ జిమ్మిన, గుం... 27

క. పండ్రెండుకండ్ల దేవర
తండ్రిశరాసనము రామధరణీశుండున్
దండింపఁ బోవునప్పుడు, గుంద్రాతికి... 28

*పాపటకాయలోన నొకబాలుఁడు సింగము వేఁట లాడెడిన్.

ఉ. ఏపున మేము కొందఱము ఏనుఁగువైరుల వేఁటఁబోవఁగా
కూపముభంగి నున్న దొకకొండబిలం బది చొచ్చిపోవఁగా

దీపముభంగి నున్న దొకదివ్యపురత్నము దెస్తిమింతినీ, పా...

*ఏకాదశినాఁడు సప్త మేడే గడియల్.

క. ఓకాంత! నాదుపెనిమిటి
యేకాంతనొ చూడఁ బోయి నేటికి నాల్గే
చేకొని లెక్కింపుము నేఁ, డేకాదశి... 30

*చందురులోనిఱ్ఱి నేలచంగలి మేసెన్.

క. కందర్పహరుఁడు నరుఁడును
పందికినై పోరిపోరి పరిపరిగతులన్
కిందైనహరునిజూటము, చందురులో... 31

*కుందేళులు రెండువచ్చి కుచములఁ గఱచెన్.

క. కందర్పుని పూఁదోఁటను
జందనముఖు లిద్దఱొచ్చి చతురత మెఱయన్
నందంది పూలుగోయఁ, కుందే... 32

*భామాకుచమండలంబు భస్మం బాయెన్.

క. కామాతురుఁడై జంగము
ప్రేమంబున బూతిఁబూసి ప్రియ మలరంగాఁ
గామించి కౌఁగిలించిన, భామాకుచ... 33

*కాకరపూపూచి నిమ్మకాయలు కాచున్.

క. కాకర కేటికి యుదకము?
చేకొని యోకొమ్మ! నిమ్మచెట్టుకుఁ బోయవే
కాకరకాయలు కాచును, కాకరపూ... 34

*మార్తాండుండపరాద్రిఁ గ్రుంకెనిదిగో మధ్యాహ్నకాలంబునన్.

శా. కీర్తింపం దగు రాముసాయకమహాగ్నిజ్వాల శుంభన్ నిశా
వర్తిన్ రావణుఁ గాంచి నారదుఁడు దేవాధ్యక్షుతోఁ బల్కెని

ల్లార్తిం బొంద మిముం జయించఁగద మున్నత్యుగ్రుఁడై దై
త్యుఁడా, మార్తాండుం... 35

*కప్పను జూడంగఁ బాము గడగడ వణఁకెన్.

క. కుప్పలకావలిలోపను
చెప్పులుకట్టుయును బూని శీఘ్రముతోడం
జప్పు డగుచు వచ్చెడి వెం,కప్పను... 36

*నిప్పున నొకచేరెఁ డంత నెత్తురు గారెన్.

క. కుప్పించి వెలుగు దూఁకిన
గొప్పగుములు నాటె నిపుడు కోమలి వేగన్
ఉప్పుగొని రావె కాతము, నిప్పున నొ... 37

*రండాగమనంబుఁ జేయ రమ్యంబ యగున్.

క. కుండినపురమున రుక్మిణి
చెండికకుం బూజనంబుఁ జేసెడివేళన్
అండజవాహనుఁ దోడ్కొని, రం డాగమ... 38

*నెలబాలను జూచి బాల నెలబాలాయెన్.

క. కలికీ! శిశు వెన్నాళ్లదె
నెలకొని వివరింతు రేపు నెలపొడపుగదే
చెలి నీళ్లాడగమునుపటి, నెలబాల... 39

*కమ్మలు మోకాళ్లు దాఁకి ఘులుఘులు మనియెన్.

క. కొమ్మను మదనుం డపుడు జ
వమ్మున నీలోత్పలములవడిఁ గురియంగా
సొమ్మసిలి మోము వంచిన, కమ్మలు... 40

*మఱ్ఱాకున విడెము సేయ మనసాయెఁగదే.

క. కొఱ్ఱన్నము ఘృతసూపము
బఱ్ఱెలపెరుఁ గూరుగాయ పచ్చడితోడన్
బిఱ్ఱుగ భోంచే స్త్రీమయా, మ...  41

*మామిడి నిలువెల్లఁబూచి మారేడాయెన్.

క. కోమలినూతనవేళను
చీమలు పదికోట్లు గూడి చిందులు ద్రొక్కన్
మామా! మామిడిపూసెను, మా...  42

*చూతుమె లవ్వుఁడాయటంచు సుందరి పలికెన్.

క. ఖ్యాతిగలరామచంద్రుఁడు
చేతోమోదంబుతోడఁ జెలఁగుచు నెంతో
ప్రీతిగ నిటుచను దెంచిన, చూతుమె...  43

*వీపునఁ జండ్లుండు గోళ్ల వెంట్రుక లుండున్.

క. గోపాలకృష్ణమూర్తిని
గోపిక యొకనాఁడు ముందుగొని తలకురులన్
ప్రాపుగఁ జిక్కులు దీర్పఁగ, వీపున...  44

క. ప్రాపని నమ్మినయొకసతి
కాపేయముచేత వచ్చి కడుమోదముతో
రూపవతి పేలుచూడఁగ, వీపున...  45

*చుక్కలలో నొక్కనక్క సుడివడితిరిగెన్.

క. చక్కనగోవర్ధనగిరి
నక్కజముగఁ గృష్ణుఁడెత్త నావులకొఱకున్
గ్రక్కున గిరి మిన్నందిన, చుక్క...  46

*పంచాస్త్రుని గేహమందు భానుఁడు వొడమెన్.

క. చంచలలోచన రాతిరి
సంచారముఁ జేసినట్టి సందడిపడకో
పంచైన మూసికొనవే, పంచా... 47

*ఆణిముత్యంబు మీసమం దమరియుండె.

తే. చంద్రశేఖరుఁ డొకనాఁడు శైలపుత్రి
యధరబింబము చుంబించునవసరమున
గిరిజనాసాగ్రమందున మెఱయుచున్న, ఆణి... 48

కాంతామణిచంటిమీఁదఁ గాకర మొలచెన్.

క. చింతామణి యనుబాఁపఁడు
పంతంబున గోడమీఁదఁ బ్రతిమను వ్రాసెన్
అంతట వర్షము గురిసెను, కాంతా... 49

*కన్నులలోఁ జన్నులమరెఁ గాంతామణికిన్.

క. చిన్నవి రుమకంబులు గొని
చెన్నలరఁగ బెస్తవారిచిన్నది రాఁగా
పన్నుగఁబొమ్మునఁ గలవల, కన్నుల... 50

*కన్నెరికము చెడకమునుపె గర్భంబాయెన్.

క. చిన్నది పండ్రెండేండ్లది
యెన్నఁడు రతికేళిసుఖము నెఱుఁగక మునుపే
వెన్నున తామర పుట్టెను, కన్నె... 51

*కుందేటను కోడిపిల్ల గుటుకున మ్రింగెన్.

క. చందనగంధులు ముగ్గురు
మందారపుఁదోఁటలోన మాపటివేళ
న్నందంది పూలుగో యా, కుం... 52

*పులు లావులు గూడి యొక్కపాలమున మెలఁగెన్.

క. చెలువుగ విశ్వామిత్రుని
యలఘుతపోమహిమనతనియాశ్రమమందున్
బలుసింగము లేసుంగులు, పులు... 53

*కామినికుచమధ్యమందు గరుడుండాడెన్.

క. చేమంతిచెట్టుక్రిందను
భామామణి నిదురపోవఁ బయ్యెదజారన్
రోమావళి పామోయని, కామిని... 54

*కప్పం గని శేషుఁ డంత గడగడ వణఁకెన్.

క. తప్పక చూచి ఖగేంద్రుఁడు
నొప్పుగ నామింటికెగిరి యొయ్యన చనుటన్
అప్పుడు రెక్కలనీడం, గప్పం... 55

*ఉత్తరమున సూర్యదేవుఁ డుదయం బాయెన్.

క. తత్తరపాటున రావణు
మత్తుండై సీతఁ గొనుచు మహిలో కపులున్
ఎత్తెఱఁగు తిరిగి లంకకు, నుత్తర... 56

*అమవసనాఁటిరాత్రినొకయుంగన సూపెను జందమామనున్.

చ. తమసముమించు లేమెడలదానవహోమగృహంబు వానర, ప్ర
ముఖులెఱుంగుటట్టులల వే(?)శ్యశిఖామణి కెద్దిసొమ్ముయో, కమ
లసుగంధిమన్మథునిగన్నదొ బెబ్బులియేడనుండునో, యమ...

*కోమలికుచగిరులమీఁద గోవులు మేసెన్.

క. తామరసనేత్ర మేల్కాఁ
దామరసాప్తుండు వొడిచెఁ దగ దీకప్వేల్
ప్రేమాలింగితరాధా, కోమలి... 58

*కొడవటిపిడి యర్ధరాత్రి కోడై కూసెన్.

క. తొడమీఁద నాఱుకులుపైఁ
బుడమిజనుం డొకఁడు నిదురఁ బోవుచు నుండం
బడె దానిమీఁద నొక్కటి, కొడ... 59

*భక్షించెను జోడుమెట్లు పాపంబొట్లూ!

క. దక్షిణ లిచ్చేవేళల
రక్షలు నే విడిచి రాజువద్దికిఁ జనఁగా
తక్షణమున శునకము మఱి, భక్షిం... 60

*గర్భములో నుండి వెడలెఁ గములాఫ్సుఁ డొగిన్.

క. దుర్భరవేదన సలుపక
యర్భకుఁ డుదయించు ననుచు నతిమోదముతో
నిర్భరత నుండెఁ బ్రాక్సతి, గర్భ... 61

*దోగ్ధ్రీధేనువుగర్భమందు బులికందు ల్పుట్టెనుగ్రాకృతిన్.

శా. దోగ్ధ్రీశాంతతపోదయాగుణనిధీ తేజస్వి పాపాటవీ, దగ్ధ్రిత్వా
నలుఁడైనకశ్యపునకున్ వ్యగ్రదర్పుఁడై యాఁగభు,గ్దగ్ధ్రిశుల్ సుతు
లుద్భవించిరి బిడౌజా వల్లి వీక్షించితే, దో... 62

*కుటిలాలకయెుడమకన్ను కుడికన్నాయెన్.

క. నిటలమున నీవు దాల్చిన
పటుతరకస్తూరిరేఖ బహుబ్రతి చేత
న్నటునిటు జాఱినచెమటను, కుటి... 63

*ఏతపుఁగొమ్ముమీఁద నొకయేనుఁగుసింగము వేఁట లాడఁగన్.

ఉ. నూతిజలంబులోన నొకనూరుశిరంబులయెద్దు మేయఁగా
నాతిపయోధరమ్మునను నల్లనిచంద్రుఁడు గాయుచుండఁగాఁ
గోఁతికిఁ బిల్లికూనకునఘోరపువైరము గల్గుచుండఁగా...

*వంకాయను జెఱకురసము వడియుచునుండెన్.

క. పంకజముఖిగురుకుచములఁ
బొంకముగా గురియొనర్చి పూవిలుకాఁడున్
ఉంకించి శరము దొడిగిన, వంకాయను... 65

*తలకాయలపులుసు తాగి తనిసిరి బాపల్.

క. పలుకూఁరి దేవళంబున
సలలితముగ మొన్నఁ జేయుసంతర్పణకుం
దొలుతను మీరంపిన చిం, తలకాయలపులుసు... 66

*వెన్నెలయెండయుం గలసి యేకముఖంబుననుండె నత్తఱిన్.

ఉ. పన్నగ విష్ణుబ్రహ్మలును పర్వతరాట్ఖగరాజదేవతల్, మిన్నను
నున్న సూర్యశశి మేదిని గూడ మహారథుండునై, పన్నగభూ
షుఁడా త్రిపురమందిరులన్ బరిమార్చినప్పుడున్, వెన్నె...

ఉ. మున్ను సురాసురుల్ జలధిమాకలు గట్టుకత్రచ్చునప్పుడున్
వెన్నుఁడు మోహనాకృతిని వేల్పులకున్ సుధఁబోయునప్పుడున్
బన్నగభూషుఁడా త్రిపురమందిరులంబరిమార్చినప్పుడున్...

*పంచాంగము చూచి లంజ పక్కున నవ్వెన్.

క. పంచమినాఁ డొకవిప్రుఁడు
కంచముఁ దా కుదువఁబెట్టి కామాతురుఁడై
మంచముపై రతిసేయఁగ, పం... 69

క. పంచమినాఁ డొకవిప్రుఁడు
అంచితముగఁ జెట్టునెక్కి యాకులుకోయన్
కించిత్తు పంచ దొలఁగిన, పం... 70

*బడబానలపంక్తిమీఁద పచ్చిక మొలచెన్.

క. పడఁతిరో నవమేఘంబులు
విడిఁబడి జడికసరుపట్టి విలయపువానల్
జడిఁబట్టి కురియ గోడలు, బడబానల... 71

*ఇంకంగస్తురిబొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్.

శా. పంకేజానన! నేటిరేయి వినుమీ పంతంబుతో రాహువున్
శంకాతంకము లేక షోడశకళాసంపూర్ణనేణాంకునిం, బొంకం
బార్పదనంచుఁబల్కెనఁ దగన్ బొంచుండి నేవింటి నీ, విం...

*కన్నకుమారునిన్ మగనిగాఁ గనె సజ్జను లెల్ల మెచ్చఁగన్.

ఉ. పున్నమనాఁటిరేవెలుఁగుఁబోలు మొగంబు మెఱుంగుసిబ్బెపుం
జన్నులు వాలుఁగన్నులును జవ్వనముం గలబాణుపుత్త్రి, వీ
రున్నగరాజధీరుననిరుద్ధకుమారునిస్వప్నమందుఁదా, కన్న...

*శంఖంబుల్ దివినుండివచ్చె నిదిగో జంబూఫలప్రక్రియన్.

శా. ప్రేంఖత్ప్రేమనుసత్యభామకొఱకై కృష్ణుండునీరేజరా, ట్కాం
క్షాణంబు వదల్చికల్పకము వేగందేఁగఁదద్వాసనా, రింఖాయు
క్తములై మిళిందములు పేర్మిం బద్మసంఖ్యల్ మహా, శం...

*పందే నాకిష్టమనుచు బాఁపడు పలికెన్.

క. పొందూర నొక్కవిప్రుని
విందుకు రాఁబిలిచి నీకు వేడుకతోడన్
ఇందెందు నిష్ట మనఁ బ, ప్పందే... 75

*పరకాళాకుట్టుఱవికె పక్కనపగిలెన్.

క. పొరుగూరుపోయి వచ్చిన
యరుదగుతనమగనిఁజూచి యతిమోదముతో
గరిపొడిచి గుబ్బ లుబ్బిన, పర... 76

*మరుఁడు దోనఁ జూపె యముఁడు కింకరులఁ జూపె.

తే. భరతకులవీరుఁ డయినట్టిపాండురాజు
మాద్రిపై దృష్టి నిలిపిన మగువ యంత
వలదు వల దని వారింపవాంఛగరిమ, మరుఁడు... 77

*ధారము లేనిహారము నితంబిని నీ కెవ రిచ్చెఁ జెప్పవే.

ఉ. భూరివివేకులౌ విటులఁ బూఁబొదరిండ్లను గూడివారిచేఁ, గో
రినభూషణంబుఁ గొని కోమలి ధారుణి వై తివందులో, హీర
ము లుల్లసిల్లఁగ మహీప్రవరుల్ వినుతింపఁబచ్చులా, ధార...

*కుంచములో బోతునక్క కూనలు పెట్టెన్.

క. మంచివి కుంచెడు సెనగలు
మంచముపై నెండఁబోసి మఱచితి విపుడే
పెంచినది తల్లియొక్కటి, కుంచ... 79

*గుఱ్ఱానికి రెండుకాళ్లు కోడికిని వలెన్.

క. మఱ్ఱికడ రెండుకాళ్లకు
కుఱ్ఱఁడు చో టడుగఁ గోడి కొనియిచ్చితినో
సఱ్ఱాజ అట్లు కా దెఁక, గుఱ్ఱాని... 80

*అనిరుద్ధుఁడు నెమలి నెక్కి యంబుధి దాఁటెన్.

క. మనసిజనందనుఁ డెవ్వఁడు
అని షణ్ముఖుఁ డెద్ది నెక్కి యరుల జయించెన్
హనుమంతుఁ డేమి సేసెను, అని... 81

*ఉత్తరమున భానుబింబ ముదయం బయ్యెన్.

క. మత్తాళి నిదురఁ బోవఁగఁ
దత్తరపడి నిదుర లేచి తమ్ముఁడ లేలే
చిత్తరువు వ్రాయఁబోవలె, ఉత్తర... 82

*యేనుఁగుకొమ్ముమీఁదఁ బదియేనుఁగులున్నవి క్రీడసల్పుచున్.

ఉ. మానవనాథ! నీ వనుప మత్తగజంబుల వేటఁ బోవఁగా, నే
నొకపర్వతంబుఁగనియెక్కఁ దొడంగినఁగుంజరంబుదా, భాను
కులేశ మమ్ముఁగని పాఱఁ దొడంగినఁబట్టి తెస్తిమీ, యే...
*కుందేటికిఁ గొమ్ములైదు కుక్కకుఁబోలెన్.

క. ముందిస్తి కుక్కపిల్లను
నందముగాఁ బసుపుకొమ్ము లయిదింటికినిన్
పొందుగఁ గొను మీవిధమున, కుందేటికి... 84

*వేకటిలేక బిత్తరియు బిడ్డఁ గనెన్ గగనస్థలంబునన్.

ఉ. మూకలు గూడి క్రౌంచములు ముందఱఁబోవుచు నుండ నొ
క్కటిం,జోకగ గ్రుడ్డుఁబెట్ట నొకసూర్యకరం బిడి దాఁకి పిల్ల
యై,యీఁకలువచ్చితల్లికడ కేఁగవడింజనె నైదునాళ్లలన్...
*గుండప్పుడు వడిగ నడిచెఁ గొమ్ములమీఁదన్.

క, మెండుగ శుకపికశారిక
తండంబులు బలసికొలువ దళవాయియువం
తుం డెదుట నడవన ననం, గుండప్పుడు... 86
*రాధేయుఁడు నందినెక్కి రావణుఁగూల్చెన్.

క. యోధ యెవఁడు కురుసేనకు
మాధవసఖుఁ డెద్ది నెక్కి మఱివిహరించున్
సాధించె నెవని రాముఁడు, రాధేయుఁడు... 87
*కుంజరయూథంబు దోమకుత్తుక చొచ్చెన్.

క. రంజనచెడి పాండవు లరి
భంజనులై విరటుఁ గొల్వ పాల్పడి రకటా!
సంజయ! విధి నేమందును, కుంజరయూథంబు... 88

*అక్కా! రమ్మనుచు మగఁడు నాలిం బిలిచెన్.

క. అక్కసివలె యిప్పాద్దున
మెక్కుచుఁ దిరిగెదవు కాలిమెట్టున నిన్నున్
గుక్కక మానను దసి నీ, అక్కా... 89

క. వక్కాకు మడిచి వేసుక
చక్కెరవిలుకానికేళిసలుపుద మనుచున్
చక్కనిముద్దులమఱఁదలి, యక్కా... 90

*భార్యలిద్దఱు శ్రీరామభద్రునకును.

తే. రావణుని సంహరించియు రాజ్యమునకు
నంగనయుఁ దాను నభిషిక్తుఁడై వెలుంగ
హారతిచ్చిరి ప్రేమతో హరునిముద్దు, భార్య... 91

*కోతికినిం గొమ్ము లాఱు గుఱ్ఱమునకు వలెన్.

క. రాతిరొకహాయము నమ్మితి
నాతురపడి హా స్త్రీకొమ్ము లాఱింటికినిన్
ఈతఱిఁగొనుగో లిచ్చెద, కోతికినిం... 92

*నూఱున్నప్పుడియాఱుకన్నులమరెరుద్రాణివక్షంబునన్.

శా. రారమ్మంచుఁగుమారునంకముపయిన్ రంజిల్లఁగానుంచి వి
స్తారోద్యద్ఘనవక్త్రపంచకముతో శంభుండుఁ దత్కాంతయు
న్నారూఢిన్ఘనపంచరత్నపతకం బాలోకనంబేయఁగా...93

*రుక్మిణిచను మొనలమీఁద రోఁకలి నిలిచెన్.

క. రుక్మిణిదేవిని నెత్తుక
రుక్మిణిపతి పోవుచున్నరూఢిగ నపుడే
రుక్మి యనువాఁడు తాఁకిన, రుక్మిణిచను... 94

*రాగా తమ్ముఁడ రారయన్న యనిభర్తం బిల్చెఁ బ్రాణార్థియై.
శా. లేరామామణి రాజసూయమునదండ్రిన్ జేయగాముద్దుశ్రీం
గారిం బన్నడిగద్దె పీఠమున వేడ్కన్నిల్పిరాస్వామికిన్, వీరుం
డై హరునెత్తి మొత్తినధనుర్విద్యాగురుస్వామికిన్, రా...
*తలలో క్కైబడినాల్గు కానఁబడియెన్ దగ్గౌరివక్షంబునన్.
మ లలితాకారుఁ గుమారు షణ్ముఖునినిన్ లాలించి చన్నిచ్చుచో
గళలగ్నగ్రహరత్నదీప్తకలికాగాంభీర్య హేమాంచితో,జ్వల
రత్నప్రతిబింబితాననములన్ శంభుండు వీక్షించినం, దల...
*పలుకులుగూబలకుమిగులపండుగనేసెన్.
క. లలితాంగిపంజరమ్మునఁ
గలచిలుకల పెచ్చురింపఁ గడుమధురముగాఁ
జిలుకలు కలకలపలికెడు, పలుకులు... 97
*వజ్రము పచ్చయ్యె పచ్చ వజ్రం బాయెన్.
క. వజ్రమయా! నీహృదయము
ఈర్జ్యాప్రాసంబు కవుల కియ్యం దగునా
వజ్రిసభ గరుడియాడఁగ, వజ్రము... 98
*పడమటికొండమీఁద నొకపద్మదళాక్షికి మొల్చె శప్పముల్.
చ. పడిగలదండిరక్కసులవాదున భాస్కరుఁ డెందుఁగ్రుంకు నీ
పుడమిని సర్వలక్షణసమున్నతి గల్గు నెలంతలెందఱో, పడ
తికి మన్మథాలయముపైనను నేమది యంకురించెనా,పడ...
*రాతికిఁ గోతిపుట్టె రఘురామునికై వడి సీతకై వడిన్.
ఉ. వాతసుతాఖ్యచేఁ బరగి వాసవవైరులు భీతిఁ జెందఁగా, ధా
త్రిసుతానురాగమునధైర్యము శక్తియు విక్రమంబువి,ఖ్యా
తి చెలంగ రావణుని పెంపడఁగింపను ధీరుఁడై పురా, రా...

*రాతిరివేళ భాస్కరుఁడు రమ్యముగానుదయించెఁదూర్పునన్.
ఉ. వాతతనూజ! భానుసుత! వాలితనూభవ! వహ్నిపుత్రకా
సేతువుగట్టుకాల మిదె శీఘ్రముగాఁ గొనిరండు కొండ లీ
రీతిగనిద్రఁబోఁదగదు లెండిక నిద్దురపోవఁగానగున్, రా...
*పసిఁడిసలాకు తీఁగెకును పర్వతముల్ వికసించి నవ్వఁగన్.
చ. విసువక పల్లవాళి దిని వేడ్కఁ బికంబులు మ్రోయఁగావసం
తసమయహేమకారకుఁడు తద్దయు వేడుకభూషణంబులం
బపవనలక్ష్మిఁ గూర్చుకొనభాసిలు సంపగిపువ్వు పేరిమేల్, ప...
*ఆకులు పోకలుం గలుగ నంతియచాలును సున్నమేటికిన్.
ఉ. శ్రీకరకీర్తిహార! గుణశేఖర! కొమ్మనమంత్రి తిక్కనన్
రాకలుగోరిముగ్ధయును రాగముచెందినమన్మథాగ్నిచేఁ
ప్రాకటమైనముత్యములు పాకములైనవి వేగతేవయా,ఆ...
*ఏకాదశినాఁడు సప్త మేడేఘుడియల్.
క. శ్రీకాంతునిదిన మెన్నఁడు
రాకొమరుని కెద్ది ప్రియము రథతిథి యెన్నం
డేకొలఁదికన్నమలుగును, ఏకా... 104
*రమణికుచంబుమీఁద నొకరంపముకత్తియు రాజహంసయున్.
చ. సమరతిచేయువేళఁ బతిసంభ్రమమంతయుఁజూచి యాత్మలో
గుములుమనంబుతోడుతను గూర్మి బయల్ పడనీక వేగమే
కమలదళంబులో నిడిన కస్తురిచే లిఖయించి చూపినన్, ర...
*రతి సేయఁగ రమణి నవ్వె రమణుం డేడ్చెన్.
క. సతియొక్కతె రేపల్లెను
బతితో రతికేళి సేయఁ బద్మాక్షుఁడు దాఁ
బతి నీడ్చి వేసి తానే, రతిసేయఁగ... 106

*దుగ్ధపయోధిమధ్యమున దుమ్ములు రేఁగె నిదేమిచోద్యమో.

ఉ. స్నిగ్ధపువర్ణుఁడీశ్వరుఁడు చిచ్చులఁ కంటనుపంచబాణునిం, దగ్ధ
ము చేసె నంచువిని తామరసేక్షణుమ్రోలనున్న యీ, ముగ్ధ
పులచ్చి మోదుకొనె మోహనగంధము పిండిపిండియై...

*ఈతాకులగుడిసెలోన నినుఁ డుదయించెన్.

క. సీతాపతిపూఁదోఁటకు
నేతా మెత్తేటివేళ యిప్పుడె వచ్చెన్
పోతా పడుకున్నావా, యీతా... 108

*చూతుమె లవుఁడా యటంచు సుందరి పలికెన్.

క. సీత తన ప్రియతనూజుని
నాతియుఁ జేరఁగఁ బిలిచి యారా యనుచున్
ఖ్యాతిగ రామునిగుఱ్ఱము, చూతు... 109

*మీనాక్షికిఁ గుచములాఱు మీనశరీరా.

క. సూనశరుఁడు నారసమునఁ
బూని కుసుమకందుకములఁ బొసగించె నవం
గాను విలసిల్లె నంతయు, మీనాక్షి... 110

*వర్షాకాలమువచ్చె గ్రీష్మమువలెన్ వైశాఖమాసంబునన్.

శా. హర్షం బెట్లగు కృష్ణదేవుఁ డిటకై
యబ్జాక్షిరాదాయె సా
మర్షాహంకృతి చంద్రుఁ డేచుతఱి భీ
మద్వేషనామోగ్రదు
ర్ధర్షక్రూరనిశాతఘాతనవచూ
తవ్రాతబాణావళీ, వర్షాకాలము. 111

*మతిలేనినరుండు మిగుల మన్నన వొందున్.

క. హిత మాచరించువారికి
హిత మొనరించుచును సుజనహితుఁ డగుచును దు
ష్కృత మెప్పుడు సేయను సం, మతి... 112

సీ. మామనోహరుఁడు మామనోహరుఁడు
మారగురుండు కుమారగురుఁడు
మామనోహరుఁడు మామనోహరుఁడు
మారగురుండు కుమారగురుఁడు
మామనోహరుఁడు మామనోహరుఁడు
మారగురుండు కుమారగురుఁడు
మామనోహరుఁడు మామనోహరుఁడు
మారగురుండు కుమారగురుఁడు

‡గీ. ... ... ...
... ... ...
... ... ... 113

*నీతరముగాదు కలహించి నిర్వహింప
చల్లపట్టాభిరామ నీచగుణధామ.

సీ. విజయరామక్ష్మావిభు మెచ్చి భాసిల్లె
ధరణిలో మా ప్రపితామహుండు
గంగాభవానిని గడుదిట్టయై తిట్టి
ఖ్యాతిఁ జెన్నొందె మాతాతయొకఁడు
వెలయంగ మగటిపల్వొంకను బడఁదిట్టి
తగఁ దెగటార్చె మాతండ్రిగారు

‡ గీతపద్యము దొరకలేదు.

ఆరీతిగాదిట్టి యమపురంబునకును
నిన్నుఁబంపఁదలంచి యున్నవాఁడఁ
గీ. గాచుకొమ్మిటుమీఁద నఖండచండ
దారుణోద్దండకవితాగభీరశక్తి, నీతరము... 114

*చరమునురేగ మేఁక మెడచన్నులవంటివి రెండుమాన్యముల్.
చ. గరిసెలు వ్రాతగానిమఱిగంపెఁడెఱుంగము మన్యదేశముల్
తిరిగి యభీష్టవస్తువులు దెచ్చి భుజింతుము సర్వకాలముఁ
సురుచిరసత్కవిత్వనిధి సూరకవీంద్రునకేలగల్గె గం,చర...

*ఏమి చేయవచ్చు నీశ్వరాజ్ఞ.
గీ. కర్మ మెవరికైనఁ గడఁ ద్రోవఁగా రాదు
ధర్మరాజుఁ దెచ్చి తగనిచోటఁ
గంకుభట్టుఁజేసెఁ గటకటా! దైవంబు, ఏమి... 116

*కులకాంతకు సాటిరారు గుప్పలచెన్నా.
క. వెలివిద్య లెన్ని యైనను
గులవిద్యకు సాటిరావు కుంభినిలోనఁ
వెలకాంత లెంద ఱున్నను, గుల... 117

*రావే! ఈశ్వర! కావవే! వరద! సంరక్షించు భద్రాత్మకా!
శా. లా వొక్కింతయులేదు ధైర్యము విలో
లంబయ్యెఁ బ్రాణంబులా
ఠావుల్దప్పెను మూర్ఛవచ్చెఁ దనువుఁ
డస్సెన్ శ్రమం బయ్యెడిఁ
నీవేతప్ప నితఃపరం బెఱుఁగ మ
న్నింపందగుఁ దీనునిఁ, రా... 118

*రావే! మానిని! కావవేతరుణి! సంరక్షించు చంద్రాననా!

శా. పూవిల్కానిసరోజబాణముల సంభోజారి మైచాయలన్
భావం బెంతయు డస్సె మేనుబడలెన్ దాపంబు రెట్టించెనే
నీవాఁడన్ మధురాధరంబొసఁగవేనిక్కంబున న్నేలవే, రా...
*కో॥ యంచుందోలికోడికూయుదనుకం గోపంబె బింబాధరా.

శా. ఆయెం బోయె నిఁ కేల నావలనఁ దప్పామాట సైరింపవా
ఆయో కానము నీమనంబు; దయ మీఱంబల్కనింతైన; నీ
ప్రాయం బేటికినిన్నుఁ బాసినఁదృణప్రాయంబయో "కొక్కరో
కో"యంచుం దోలికోడికూయుదనుకం గోపంబె బింబాధరా.

తెలుఁగుసమస్యలు సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1953.